Regd No. N 45 / M. 3813

గోలకొండ కవులసంచిక
చందాదారులకు
౧ రూపాయి
మాత్రమే.
గోలకొండ పత్రిక
త్రూప్‌బజారు,
హైదరాబాదు-దక్కన్.

# గోలకొండపత్రిక

103404

ప్రతి సోమ, గురువారములందు వెలువడు జాతీయపత్రిక

హైదరాబాద
విధానములకు
నిజాంరాష్ట్ర
పరిపాలనము
రూ ౬ అణాలు
గోలకొండ బుక్‌డిపో
త్రూప్‌బజారు,
హైదరాబాదు.

సంపుటము ౧౨ | హైదరాబాదు - దక్కన్ ౩౦ ఫర్వర్ది ౧౩౪౭ఫ. శా.శ.౧౮౫౯ ఈశ్వరనామ సంవత్సర మాఘ శు|| ౧ గురువారము | సంచిక ౭౪

# ఉపన్యాసము

## హైదరాబాదు సంస్థానముతో ఆంధ్రజనుల సంబంధము

### ఉత్తరసర్కారులును దత్తమండలములును నేటికిని నిజాంరాష్ట్రములో నున్నచో—

### దక్కన్ నాగరికత నిర్మాణములో ఆంధ్రులభాగము

ఉస్మానియా పట్టభద్రులకు డాక్టర్ సి. ఆర్ రెడ్డిగారి స్నాతకోపన్యాసము

నేడు ఉస్మానియా విద్యాపీఠముయొక్క పట్టప్రదానోత్సవ సందర్భమున ఉపన్యసించుచు డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి గారు ఆంధ్రులను కొండపై కెక్కించిరి. ఆంధ్రులకును హైదరాబాదునకును సంబంధమును విశదీకరించి, ముందుకు ఈ సంబంధమును చక్కగా నిలుపుటకై ఒక సూచన చేసిరి.

"నేనీరోజు ఇచటనున్నది స్వయముగ నాకున్న గౌరవమునుబట్టియని పొగడుకొనజాలను కేవలము ఆంధ్రుడ నైనందుననే నిచటకు రాగలిగితిని. నేను ఆంధ్ర వైస్‌ఛాన్సెలరుగ నున్నాను. అవగా నాకు హైదరాబాదుతో స్వయముగా సంబంధము లేదని కాదు. ఇప్పటికి దాదాపు పరిగా ౩౦ యేండ్లక్రింద నేను హైదరిగారిచే ఆహ్వానింపబడి ఈ రాజధానినగరమునకు వచ్చియుంటిని అప్పుడు హైదరిగారికి ఇపుడున్న బిరుదులు లేకుండెను. అప్పుడు నాహృదయము ఈ రాజధానినగరమందలి సాంఘిక, వైజ్ఞానిక దర్శనీయ విశేషములజూచుటచే కలిగిన ఆనందముతో తృప్తినొందెను. మరల నాలుగుసారులకు తక్కువకాకుండ నేనిచటికివచ్చి ఆనంద పరవశుడనైతిని వచ్చిన ప్రతిసారియు, ఈరాష్ట్రము క్రమక్రమముగా సాధించుచుండిన అభివృద్ధిని చూచి గర్వించి, కృతజ్ఞతదెలుప గలిగితిని మహాఘనతవహించిన నిజాంప్రభువుగారును ఇక్కడి విశ్వవిద్యాపీఠాధికారులును చూపిన ఆదరముచే, నేను పూర్వార్జితములైన మైత్రిబంధములను దృఢపరచుకొన గల్గితిని ఈ మైత్రిబంధములలో నేను బరోడాలో నుండి నరోజులలో సంపాదించుకొనునట్టివి గలవు. అవి నాజీవితములో ఒక విశేషమైన విలువగలవి, మిక్కిలి పరిమితములైనవి. నాజీవితముయొక్క పశ్చిమార్థములో ఈ హృదయానందకరమైనచోట చేరగలిగితినిగదా యని సంతోషించుచున్నాను

నేనిపుడు ఆంధ్రవిశ్వకళా పరిషదధ్యక్షుడనగ నుండుటచే ఉస్మానియా విశ్వవిద్యాపీఠమునకు ఆపరిషత్తుయొక్క శుభాకాంక్షలను తెలుపగోరుచున్నాను ఉస్మానియా విద్యాపీఠము జనులను కోరుచున్నంతకంటె శీఘ్రతరముగ మనదేశములో గల గొప్ప పాండిత్య, పరిశోధన కేంద్రములలో నొకటికాగల లక్షణములు కనిపించుచున్నవి. నేనిచటికి రాగానే, గొప్పయింటికి చెందిన నాఅధికారమువంటి అధికారమునేగలిగిన నవాబ్ మెహిదియార్జంగుబహద్దరుగారును, ప్రొవైస్‌ఛాన్సెలర్ గారును, ఉస్మానియా ఫాకల్టీలసభ్యులును ప్రేమతోనిచ్చిన స్వాగతమును చేనన్నిటికిని మించుజాలను స్వాగతము పొందుచున్న వ్యక్తి ఎంత అనర్హుడైనను వారలు ప్రేమతో స్వాగతమిచ్చుటచే, ఇక్కడ విద్యాప్రచారనిమగ్నులగు వారందరు సోదరులవలె మెలగు నాచారము ఎంత సహజమైయున్నదో, విద్యాప్రచార నిమగ్నులలో ఉచ్చ నీచభేదము లుండరాదనుభావము ఇక్కడ ఎత సత్యముగ నున్నదో తెలియుచున్నది ఇప్పటికిని పొగడుచు దట్టముగ క్రమ్మియున్న ఈప్రపంచమందు కుల మత భేదములు పాటించక విద్యాప్రచార నిమగ్నులందరును సోదరులవలె మెలగు నాచారము అంత నిర్లక్ష్యముగ త్రోసివేయదగిన అంశము గాదు.

ఈ రాష్ట్రముండేగాక రాష్ట్రము వెలుపలను అందరికంటె గొప్ప విద్యాపోషకులగు మహాఘనతవహించిన ప్రభువుగారికి ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఎంతో కృతజ్ఞమైయున్నది. ఇట్లే ఈ పరిషత్తుయొక్క క్షేమమునందును, అభివృద్ధియందును సప్రయోజనమైన శ్రద్ధ వహించుచున్న ఆ ప్రభువుగారి ప్రభుత్వమునకును ఈ పరిషత్తు మిక్కిలి కృతజ్ఞతయైయున్నది. వారలిచ్చిన విరాళమును ఆంధ్రజనులు ఎంతఉత్సాహముతో స్వీకరించిరో నేనిదివరకే వాల్తేరులోనిచ్చిన స్నాతకోపన్యాసములో దెలిపియుంటిని. ఈ రాష్ట్రమును ఆంధ్రదేశమును బంధించు సజాతీయ ప్రేమలో నాటుకొనిన ఈ ఉదార పోషకత్వము ఎంతయు అర్థమని పించుకొన సాహసించు చున్నాను. తమరియొడ విధేయులైన ప్రజలలో అధిక సంఖ్యాకులగు ఆంధ్రులయెడ మహాఘనతవహించినవారికి గల సానుభూతియే ఈవిరాళమున కాధారమని నాకు నిస్సంశయము. నేనీరోజు ఇచటికి ఆహ్వానించబడుటయు ఆసానుభూతికి గురుతు

"భారతదేశము యొక్క వైజ్ఞానిక, సాంఘిక, రాజకీయ చరిత్రలో హైదరాబాదు చాల ప్రధానస్థానము వహించు చున్నది. ముఖ్యముగా ఆంధ్రజనులతోటి సంబంధములో ఈ ప్రాముఖ్యత ఎక్కువగానున్నది.

చపలమైన చరిత్ర దైవము చీలికలు గ జేయునంతవరకు ఉత్తరసర్కారులును దత్తమండలములును ఈ రాష్ట్రములో నొకభాగమై యుండెను. అవి ఇప్పటికిని భాగముగనుండి యున్నచో హైదరాబాదుసంస్థానము చాలమట్టుకు సంపూర్ణముగా, ఎట్లయినను అధికభాగమైనను ఆంధ్రసంస్థానము గానుండి యుండెడిది. నేటికిని తెలంగాణా ఈ రాష్ట్రములో ఎక్కువ భాగమైయున్నది. మహాఘనత వహించినప్రభువుగారియందు భక్తివిశ్వాసములు కలిగియుండు ఆంధ్రులు ఈరాష్ట్రవాసులలో అధిక సంఖ్యాకులైయున్నారు. ఆంధ్రులచరిత్రయొక్క ఆధారములు, నేడు మీపరిపాలనలోనే లోపలనున్నవి. వరంగల్లు కాకతీయ రాజవంశముయొక్క రాజధాని నగరముగ నుండెను. అక్కడినుండి చరిత్ర మూడు ప్రవాహములుగ, చీలి, విజయనగర సామ్రాజ్యమును, కొండవీడు-రాజమహేంద్ర వరముల రెడ్డిరాజ్యములను, వెలమరాజ్యములును ఏర్పడినవి సారస్వత చరిత్రలో ను పరిపూర్ణముగా మహాకవి భాగవత పురాణమును తెలుగు చేసిన స్థలముగ వాసికెక్కినది.

"హైదరాబాదు సాధించిన అభివృద్ధిని చూచిన సంస్థానములలో తెల్లనది అగ్రగణ్యమను మాట సత్యమని తెలియగలదు. అది కేవలము బ్రిటిషురాష్ట్రముయొక్క గాని ఇతర సామ్రాజ్యరాజ్యములయొక్క ప్రతిగాదు. అది స్వదేశీ వస్తువు రాజ్యాంగమనెడి ఖద్దరువంటిది. ఈ ఖద్దరును నేసినది భారతీయుల హస్తములే, దాని స్వరూపమును నిర్ణయించినది భారతీయ చరిత్ర, భారతీయ ప్రతిభతో, దాని నలంకరించు రంగులు హిందూముసల్మానుల సహకారము, సోదరభావములయొక్కవి. అది మనభూమిలో నాటుకొని, అక్బర్ మహాచక్రవర్తివంటి మొగలాయి చక్రవర్తుల బుద్ధిలో ఉదయించి వారలచే పోషితమైన హిందూముసల్మాను- ఐకమత్యమునుండి పుష్టిని పొందుచున్న జాతిరూపమైన ఒక పదార్థము.

హైదరాబాదు చరిత్రలో హిందువులును ముసల్మానులును సమానగర్వము పొందవచ్చును. ఈరాష్ట్రపాలనలో సాధారణ శాఖలలోనేగాక సైనికశాఖలలోను హిందువులు చాల ఉన్నతాధికారములను ధరించియున్నారు. దీని నొక రాజ్యముగ నిల్పుటకై పోరాడినసేనలలో హిందువులే, అందులోను విశేషముగ, నిజముగ చెప్పవచ్చునేని ఆంధ్రులును రెడ్లును ఎక్కువగనుండిరి హిందువుల దేవాలయములను సంపూర్ణముగ అభిమానించి, సంరక్షించిరి. కొందరు నిజాములు తమ ఫకీరులను వలెనే హిందూ సన్యాసులనుకూడ భక్తితో గౌరవించియుండిరని అందరికిని తెలిసియే యున్నది.

"ఈరాష్ట్రము భారతదేశ మధ్యభాగమందున్నది. కొన్ని ఆంశములనుబట్టిచూచినచో, ఇది భారతదేశముయొక్క హృదయమనిపించును. అనగా కేవలము భూకేంద్రమాత్రము కాదని అభిప్రాయము ఇక్కడ యొక క్రొత్త నాగరికత జన్మించినది. దానిని దక్కను నాగరికత యనవచ్చును. ఇటీవల మహాఘనతవహించిన నిజాముగారి ప్రభుత్వము ప్రసిద్ధములైన బౌద్ధకీర్తిలములను, కళాప్రపంచమందలి మహోన్నతవిజయములను సంరక్షించుటకై అపారమైనధనము వ్యయము చేసియున్నారు. అజంతాలోను, ఎల్లోరాలోను రాతిలోచెక్కిన దేవాలయములలో చాల ఖాజాసుగా గుహ్యలో చిత్రితములై చిత్రములు గలవు. అందు బౌద్ధులలో దేవాలయములను తొలుచుట మహాకార్యము బలమునకును, యంజనీరింగు ప్రావీణ్యమునకును నిదర్శనమైయుండ మానవ నాగరికతలో శ్రీరూపము దేవతాంతఃనము లేవిగలవో వాటి అనంతమై నాజూకునకును అందమునకును నిదర్శనమై యున్నది.

"భారతదేశముయొక్క అభివృద్ధి పవాహమునకు ఆటంకము కలిగి అది మరియొకచక్కనకు త్రిప్పబడక యుండినచో దానిహృదయము దక్కను నాగరికతను సాధించియుండెడిది. ఆ దక్కను నాగరికత స్వరూపమును చిత్రించుటలో నేను ముసల్మానులకునుగల సంబంధమును చెప్పుటను అనుమతింతురుగాక! శిల్పములను కళలను సంయోగము చెందసాగెను. మతములుకూడ ఈ ఉన్నత సంయోగక్రియనుండి తప్పించుకొనజాలకపోయెను. భగవంతుడొకడే యనియు, ఇస్లాంధర్మమందలి సమానుల నియమమును ఇస్లాం తత్వమెక్కిన పోతులూరి వీరబ్రహ్మము హిందువులలో వర్ణభేదములను మహాభయంకరముగ "ఈప్రాపంచిక వాసనకలమానవులకును మూర్ఖులకును నాది వీవర్ణమని చెప్పుకొనగలరు! ఈవిశ్వమంతయు నావర్ణము అని దూషించినారు. నాజన్మస్థలము చిత్తూరికిదూరమైల్లదూరములో చంద్రగిరివద్దనున్న నామహాలు మహమ్మదీయ శిల్పలక్షణములను కలిగియున్నది. బీజపూరులో రెండవ ఇబ్రహీం యొక్క సమాధి హిందూనిర్మాణ లక్షణములలోనున్నదని నేను వింటిని.

అద్దంకి గంగాధరకవి తన తపతీ సంవరణోపాఖ్యానమును గోలకొండలో నేలుచుండిన ఇబ్రహీం కుతుబుషాకు అంకితము చేసెను. ఆకావ్యమందు ఇబ్రహీంలస్థానమును వర్ణించునపుడాతను గజపతి నరపతి మహారాజుల ప్రతినిధులనేగాక అష్టభాషా పాండిత్యముగల కవులను వేదశాస్త్ర పురాణములయందు ప్రామాణికులగు పండితులనుకూడ పేర్కొనియున్నాడు. తెనుగులో ఇబ్రహీమును మల్కిభరాముని నాడు. ఆతడు భారతదేశపు హిందూకథను విన సతూహలుడై యుండినట్లు వర్ణించబడియున్నాడు. సంస్కృతపదములుగాని, సంస్కృతభవములైన పదములుగాని లేయక అచ్చతెలుగులో రచించబడిన మొదటికావ్యమగు యయాతిచరిత్రము జానకవియగు పొన్నిగంటి తెల్గన్నచే ఇబ్రహీం కుతుబుషాయొక్క అధికారులలో నొకరగు అమీర్‌ఖానునికి అంకితము చేయబడినది.

"షట్చక్రవర్తి చరిత్ర"యొక్క రచయితయు, సుప్రసిద్ధ కవియునగు మల్లారెడ్డి తాను ఇబ్రహీంమల్కీయొక్క ఆస్థానమునకు ఆహ్వానము పైపోయి చూచివచ్చినట్లు వర్ణించియున్నాడు. మరియు ఒకప్రశంసా పద్యములో ఆరాజును చంద్రునికి పోల్చి అతని ప్రతిస్పర్థులగు కవులను రాజులను చంద్రునిజూచి మొలుగు కుక్కలనుగ వర్ణించినాడు.

దక్కనుచరిత్రలో అక్కన్న మాదన్నల పేర్లు ప్రసిద్ధములైనవి. వారలు గోలకొండసుల్తానులలో కడపటి వాడగు తానీషాయొక్క ప్రధానమంత్రియు, సేనానాయకాధిపతియునై యుండిరి. అక్కన్నయొక్క ముగ్గురు మేనల్లుండ్రును గోలకొండ రాజ్యములో గొప్పబాధ్యతతోకూడిన అధికార పదవులయందుండిరి. వారలలో గోపన్నయొకడు. అతడే భద్రాచల ప్రసిద్ధిగాంచిన రామదాసు. నేటికిని గోలకొండను పోవువారికి అక్కడరామదాసు భద్రాచల దేవాలయమును అలంకరించుటకును ఆ దేవాలయమందలి విగ్రహములకు విలువగల సొమ్ములు చేయించుటకును రాజ్యద్రవ్యమును వాడినందుకై శిక్షితుడై యుంచబడిన కారాగారము చూపబడుచున్నది. రామ లక్ష్మణులు తానీషావద్ద రామదాసు దూతలుగ ప్రత్యక్షమై అతనికీయవలసిన డబ్బిచ్చినట్లును, అంతట తానీషా తనవద్దకు మానవరూపమున వచ్చిన వారలు దేవతలని గ్రహించి తన అదృష్టమునకు సంతోషించి, భగవంతునట్లు తనపై కృపారసమును కురిపించిరని ఆనందపరవశుడైనట్లును కథగలదు ఇది హిందువులును ముసల్మానులును ఎట్లు ఒక్కటిగ్గవలె మెలగుటకు ప్రారంభించిరో చూపుచున్నది. తానీషాయొక్క పేరు హిందువులు గౌరవించు పేర్లపట్టికలో కెక్కినది.

అంతకంత కెక్కువగా హిందూ ముసల్మానుల నాగరికతల సంగమమైనందుచే ఈసంస్థానము ఇంతకంటె గొప్ప విశేషములను సాధించుటకు ఉత్సాహము పొందగలదు. మహాఘనతవహించిన నిజాం ప్రభువుగారియొక్కయు రైట్ అనరబిల్ సర్ అక్బర్ హైదరిగారి నాయకత్వమున వారి ప్రభుత్వముయొక్కయు ఇప్పటివిధానము మనలక్ష్యమగు విచ్ఛిన్న భారతదేశాత్మయొక్క ఐక్యతను సాధించుటకై క్రమక్రమముగా, విశాలభావముతో యత్నించుటయై యున్నదని నాకు నిస్సంశయము.

నేందివరకే చెప్పియున్నట్లు దాదాపు సరిగా ౩౦ ఏండ్లక్రిందట హైదరిగారడుగగా హైదరాబాదుకు వచ్చియుంటిని. అప్పటికే హైదరాబాదు మనోహరముగ నుండెను. తరువాత సంవత్సరములలో దాని అభివృద్ధి ఎంతగొప్పగ నుండవచ్చునుకొన్నవారి ఊహలకుకూడ మించిపోయినది. నేడు ఎటుజూచినను హైదరాబాదు భారతదేశములో నైతిక, ఐహిక అభివృద్ధిలో ముందువడచుచున్నది. కాబట్టి భారతదేశముయొక్క పతాకమునుధరించి ముందు నడచుచున్న సంస్థానములలో నిదియొకటి యనవచ్చును. కాని ప్రభుత్వముతో ప్రజల సంబంధమును అంతకంతకు ఎక్కువ చేయుచుండుట ఇంకను సాగుచుండవలెను. ప్రజలు ఏ జాతియనను చెందినను, ఆంధ్రులైనను, మహారాష్ట్రులైనను, ముసల్మానులైనను, ఈ రాష్ట్రమందు భక్తిగలవారై అది విచ్ఛేదము గాకుండునట్లును, దాని చారిత్రికాస్మి సంరక్షితమై పుష్టినొందునట్లును చూడవలెను. ఈరాష్ట్రములో జనులు పరస్పరానురాగవంతులై అందరును మహాఘనతవహించిన ప్రభువుగారియందు భక్తిగలిగి, ఈ రాష్ట్రముయొక్క అర్థిక సంపదను, వైజ్ఞానికాభివృద్ధిని పోషించుటకును, ఇప్పటికంటె ఎక్కువనాజూకుగా తమతమక్కలో ఒక్కస్వరముతో అఖిలభారతదేశమునకు సందేశమును వ్యాపింపజేసి వెలుపల ప్రపంచముయొక్క ప్రశంసలకు పాత్రమగుటకును కోరుచున్నాను.

"తన చరిత్రనుబట్టియు, భారతదేశ భవిష్యత్తునుబట్టియు ఈ రాష్ట్రమునకు గొప్ప కర్తవ్యమొకటిగలదు. ఈరాష్ట్రము మొగలాయి చక్రవర్తుల సంప్రదాయమగు హిందూ—ముసల్మానుల ఐకమత్యమును, పౌరత్వమునకు సంబంధించిన ఐహికవిషయములలో వారల భాగస్వామిత్వమును సంరక్షించవలసినదై యున్నది. ఏ రాజ్యాంగమునకుగాని ఉత్తమమైన సంరక్షణపుటేర్పాటు దాని బాహ్యాకారముగాదు. మరి ఏదన పాలకపాలితుల ఏకోద్దేశ్యమును, సంస్థాన క్షేమమునుగూర్చియు, దాని అభివృద్ధి బలములనుగూర్చియు శ్రద్ధయు—ఇవి నిజమైన సంరక్షణలు. జాతియొక్కబలమును ఎక్కువచేయజాలని అభివృద్ధి అభివృద్ధిగాదు, వినాశమునకు త్రోవతీయు ఒకరోగ మనవలెను.

"హైదరాబాదు విశ్వవిద్యాలయ విద్యను అన్నిశాఖలలోను దృఢనిశ్చయముతో పోషించవలెనని నేనపేక్షించు చున్నాను. ఉస్మానియా విశ్వవిద్యాపీఠము తానొక క్రొత్త పథము త్రొక్కినది. మన విశ్వ విద్యాపీఠ విద్యావిధానమున కొక నవ్యమంజుల గాంభీర్యరేఖనలంకరింప జేసినది. అట్టి ఈ విద్యాపీఠము జనంగరికి వలెనే నాకును గొప్పఆనందము కలిగించినది. ఇందుకు హైదరాబాదేగాక భారతదేశమంతయు గర్వించుట న్యాయమే. నేనాంధ్రుడను గనుక అదియున్నచోటుకు"అధిక మెట్టు" యని తెలుగుపేరున్నందుకు ఎక్కువగ సంతోషించు చున్నాను. "అధికమెట్టు" యనగా గొప్పదిబ్బయని అర్థము. ఈ రాష్ట్రరాజధానియే తెలంగాణాలో నుండుటయు, నాకు సంతోష మొనగూర్చు చున్నది. ఈ గొప్పరాష్ట్రమునకు సంబంధించిన ప్రధాననగర సంబంధములైన కార్యములన్నిటికిని మేముస్థానము ఆంధ్రులము మేము గర్వించుచున్నాము.

ఉస్మానియా విద్యాపీఠమును సాహసించి నూతనపద్ధతిపై ఏర్పాటుచేసినందుకు ప్రధాన గౌరవము నామిత్రుడు రైట్ అనరబిల్ సర్ అక్బర్ హైదరిగారికి చెందుచున్నది. ఈసందర్భమున నేను నాసొంత పరిచయములో జ్ఞాపకమున్న ఒక చరిత్రాంశమును జ్ఞప్తిచేయగోరెదను. అప్పుడు ఈబిరుదులు లేకయుండిన హైదరిగారు విద్యాపీఠ ప్రణాళిక ప్రారంభములో పలుమారు నా సలహా నడిగియుండిరి. విశేషించి ఉర్దూలో విద్య నేర్పు విషయమై అడిగియుండిరి. నేను ఆపద్ధతి చాలమంచిదని చెప్పితిని. నేనిసంగతిని జ్ఞాపకము చేసినపుడు ఇదంతయు అహంభావమునకు—ఇక నెన్నటికిని కుదరని వార్ధక్యసంబంధమైన అహంభావమునకు లక్షణమని తలచకుండెదరని నమ్ముచున్నాను. హైదరిగారికి నారుసాపించిన తర్జుమాశాఖయందుగల అభిమానమును, ఆశాఖయొక్క వివిధ ప్రచురణములనుగూర్చి వారు నాకు తెలిపినదియు, నాకు జ్ఞాపకమున్నది. నేనప్పుడు ఉర్దూలో నేడు సాధ్యమైనది రేపు హిందీలోను, తెలుగులోను, ప్రతిఇతర భారతదేశీయ భాషలోను సాధ్యము కావచ్చునియు, అందుచే ఉస్మానియా విద్యాపీఠము స్థానిక లాభము చేయుటయే గాక అఖిలభారత దేశమునకును మనవిజ్ఞానమునకు చాలముఖ్యమైన గొప్పవిషయమును తెలియజేయుచున్నదనియు నేను అనుకొంటిని. ఈ నవ్యశేఖరి భారతీయ భాషలయొక్కయు విజ్ఞానముయొక్కయు భావ్యదృష్టమందు విశ్వాసమును కలిగించుచున్నది. అట్టి ఈశేఖరి ఇక్కడ ఏర్పరచబడిన వివిధశాఖలను ప్రేరించగలదు, ప్రేరించుచున్నది. పరిశోధనయు నిర్మాణకార్యములును దీని ఫలితముగా చిరస్మరణీయ విదన్మయమును గాంచగలవని నాకు నమ్మకముగలదు.

"ఈ విశ్వ విద్యాపీఠమును మ. ఘ. వ. ప్రభువుగారును, ప్రభుత్వమువారును పోషించుచున్నవిధ మీభారతదేశమందు ప్రతివానికిని ప్రతి ప్రభుత్వమునకును గుణపాఠముగ నుండవలెను."

* * *

ఈరాష్ట్రము ఆంధ్రవిద్యాపీఠముపై దయను అభిమానమును, ప్రేమను, అనురాగమును చూపి చిన్నమాత్రాన చాలదు హృదయములు కలిసినవి, ప్రేమలున్నను, వాటిని ఒకవివాహసంపరూపము నొందించవలెను. లేనిచో అవిసంక్షుభమున సే చేటుజెమ్మను. అట్లే ఇపుడు మ.ఘ.వ. ప్రభువుగారి రాష్ట్రమునకును ఆంధ్ర దేశమునకుగల అనురాగ సంబంధమును విజ్ఞాన రంగములో ఒక సంస్థస్వరూపము నీయవలెను. ఈ ఒక్క విజ్ఞానరంగములో వివాదములకు అవకాశముండదు. ఇక్కడ సామరస్యము ఏకోద్దేశ్యత్వము సహజముగనుండును. అదిఎట్లు సాధించవలెనో ఆసమస్యను పరిష్కరించవలెను. కాని నాకు పరిష్కారము కుదరదను నిరాశలేదు. తెగియున్న చక్రపాశములను మనము/తిరిగి ముడివేసి ఆత్మైక్యతను పునరుద్ధరించవలెను. సాధ్యమైన ఒక ఉదాహరణమిచ్చెదను. ఈ రాష్ట్ర ప్రభుత్వము తర్జుమా చేయించుచున్న సంస్కృత శాస్త్ర గ్రంథములలో ఆంధ్ర విద్యాపీఠము కోరడమేగా దానిని పరిగా గౌరవముగా ను అంగీకరించుటకు సంసిద్ధమైయున్నది."

## బ్రిటిషు విమానముపై జపాను తుపాకి దెబ్బ

### బ్రిటిషువారు ప్రాతిదారి మార్పుట

లండను ఫిబ్రవరి ౨౧

ఇంపీరియల్ ఏర్‌వేస్ టప్పా విమానమొకటి బాన్‌కాక్ (సయాములోనిది)నుండి హాన్గకాంగుకి పోవుచుండ, కొన్ని జపాను విమానములు అదిచైనావారి విమానమనుకొని దానిని వెంటతరిమెను. కొంతసేపయినతరువాత చాల విమానములు తమ ప్రయత్నమును మానుకొనిరి.

అవి బ్రిటిషువిమానమని తెలుసుకొనుటకుముందు ఒక జపానువిమానము దానిపై తుపాకి ప్రయోగించినదని లండనుకు వార్త రాగానే ఈ విషయమును వెంటనే టోకియోలోని జపాను అధికారులకు తెలిపిరి. వారు హాన్గకాంగులోని జపాను-కౌన్సలు ద్వారా అచటి బ్రిటిషు అధికారులకు తగిన క్షమార్పణలు తెలుపుకొనిరి.

ఎందుకయినను మందిదే అనుకొని టప్పా విమానముల దారిని బ్రిటిషువారు కొంతకాలము వరకు మార్చుటకు నిశ్చయించిరి. కాని బ్రిటిషు విమానములకు ఆ ఇష్టమువచ్చినచోట వనుసుటకు హక్కుగలదని బ్రిటిషు అధికారులు ఖండితముగ తెలిపిరి.

## ఇటలీకి హిట్లరు ప్రయాణము

బెర్లిన్: ఫిబ్రవరి ౨౧

మేనెల మొదటిపక్షములో జర్మనీఛాన్సలరు హెర్ హిట్లరుగారు, ఇటలీకి వెళ్లుదురని అధికారప్రకటన అయినది. నౌకాప్రదర్శనము, సేనలకవాతు, వైమానిక, శతఘ్నికా దళముల ఊరేగింపులు ఫాసిస్టుపార్టీ పెరేడ్ మొదలగు వేడుకలను మహావైభవముతో ఆ సందర్భమును జరుపుటకు ముసోలినిగారు తీవ్ర సన్నాహములు చేయుచున్నారు.

## చైనావారు ౫ లక్షలు మరణించుట

### ఇంకను చైనా ధైర్యము

షాంగ్‌హై ఫిబ్రవరి ౨౧

హాంకో నగర పరిపాలన వర్గమునకు చేరిన చైనాజనరల్ షై చుంగ్ హై గారు యిట్లు చెప్పిరి:—

"జపానుతో చైనా చేయుచున్న యుద్ధములో యిప్పటికి చీనావారు సుమారు ఐదు లక్షలమంది నిహతులయిరి. ఇంక కొందిపాటి నష్టమునకే చీనా జంకవలసినపనిలేదు. ఐదుకోట్లు నష్టమునకు లగుదురకు నిస్పృహ చెందపనిలేదు. పదికోట్లుజనము చచ్చినచో దిగులుపడవలసియుండును. మంచూకు రాజ్య స్వాతంత్ర్యమును జర్మనీ ఐప్పుకొన్నది అనకూడ మీరు చెప్పిరి.

# త్రాగుడుమానుటకు విజయవంతమైన ప్రచారము

## అనాజుపురంలో మద్య నిషేధ సభ

కల్లు గిరాకి పూర్తిగ పడిపోవుట

(స్వకీయ విలేఖరి)

అనాజుపురం ౧౯-౫-౧౩౪౭ ఫ.

౧౪-౫-౪౭ భువనగిరి సమీప అనాజుపురంలో సాయంత్రము ౫ గంటలనుండి శ్రీయుత ఉత్పల వెంకటరావుగారి అధ్యక్షత క్రింద మద్యపాననిషేధసభ సమావేశమయ్యెను. గ్రామములోని దాదాపు సగమునంది స్త్రీ పురుషులు సభలో పాల్గొనిరి. అధ్యక్షుని వెంట భువనగిరి నుండియు పదిహేనుమంది యువకులు వచ్చియుండిరి. స్థానిక గ్రామాధికారులు, వకీలునగు పన్నాల వెంకటరామరెడ్డిగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగానుండి అతిథుల సత్కరించిరి.

ఉపన్యాసములు

పి వెంకటరామరెడ్డిగారు

గుండా కేశవులు గుప్తగారు

పి మల్లారెడ్డిగారు

వి సత్యనారాయణ పంతులుగారు అధ్యక్షులవారును సభ్యుల మనస్సునందు మద్యపానముపై అసహ్యము జనించునట్లు ధారాళముగా ఉపన్యసించిరి. స్థానిక యువకులు ఏకాంకనాటకము నప్పుడే ప్రదర్శించిరి.

భుజరగం శివరాములుగార్లు మద్యపాన నిషేధమునుగూర్చి స్వంతకవిత్వపద్యముల చదివి శ్రోతల నానందపరచిరి. సాయంత్రము ౧౦ గంటలవరకు సభ జరిగెను. ఆనాటినుండి అనాజుపురము కల్లు గిరాకి పూర్తిగ పడిపోయెనని తెలియుచున్నది.

## బొందుగులలో మధ్యపాన విసర్జనము

తదనంతరము ముస్తాజిరుల చర్యలు

(ఒక విలేఖరి)

బొందుగుల

బొందుగుల గ్రామములో కొన్నిరోజుల నుండి జనులు కల్లుత్రాగుట మానివేసిరి. దీనిపై మాఘశు॥ ౬ రోజున ౪౦ కుండలకల్లు నడిగ్రామములో శాలుగుబాటల మధ్య బలిపోయబడినది అకల్లు నిల్వఉండుటచే దుర్వాసన గ్రామమంతయు కొట్టుచున్నది.



## విజయవంతమైన మద్యపాన నిషేధ ప్రచారము

మహబూబునగరం జిల్లాసంఘ వార్షికోత్సవము

క్షామబాధితులగుటచే రైతులనుండి వసూళ్ళను మానుకొనుట

(స్వ. విలేఖరి)

కల్వకుర్తి

కల్వకుర్తి తాలూకాస్థలము. ఇక్కడి జనసంఖ్య (౩౬౦౦) మునిసిఫ్, న్యాయస్థానము తహసీలు; అంగ్లవైద్యశాల, యునాని వైద్యశాల ఉన్నవి. ఏడవతరగతివరకు ప్రభుత్వ పాఠశాల ఉన్నది. కొలదికాలముక్రిందటనే జిల్లా సంఘమువారి యాజమాన్యమున ఒకగ్రంథాలయమును స్థానికప్రముఖులు స్థాపించిరి. తాలూకాలోని వివిధగ్రామాల ప్రముఖులు గ్రంథాలయమునకై విరాళములనొసంగుటకు వాగ్దత్తము చేసియుండిరి. కాని ఇంకను కార్యక్రమము ఉపక్రమింపలేదు. కార్యనిర్వాహకులు త్వరలో ఈపని అరంభింతురని వేచియున్నారు.

మద్యపాన విరోధక సమావేశములు జరుపుటకై, జిల్లా తాలూకాద్వారా తహసీలుకు కరపత్రములు ఉత్తరువు అందినందున పటేలు పట్వారీలచే కల్లంగళ్లవద్ద ప్రజలకు ప్రబోధము జరుపబడుచున్నది దీనివల్ల గొప్ప మార్పుకు అవకాశ మేర్పడినది.

౨౪-౫-౧౩౪౭ ఫ. నాడు మద్యపానము శ్రీయుత రామారెడ్డిగారి గృహమందు, జిల్లాసంఘ కార్యనిర్వాహకసభ సమావేశమైనది. జిల్లాసంఘ వార్షికోత్సవము కల్వకుర్తి తాలూకాస్థలమందు ౯ వ తీరు ౧౩౪౭ ఫ. తేదీన జరుపుటకు నిశ్చయింపబడినది.

ఈ వార్షికోత్సవ సమావేశము జయప్రదముగా జరుపుటకై తాలూకా పౌర ప్రముఖుల ఇష్టాగోష్ఠి అలోచన సమావేశము జరిగినది సుమారు ౨౫ మంది ప్రముఖులు ఈసమావేశములో పాల్గొనిరి. ఈవిషయములో అవసరమగు అలోచన యిచ్చుటకు హైద్రాబాదునుండి శ్రీ మందుముల రామచంద్రరావు (స్థాయిసంఘకార్యదర్శి) శ్రీయుత రా. వెంకట నారాయణరెడ్డి గారు, జిల్లాసంఘపక్షమున శ్రీయుత చిక్కెపల్లి రామచంద్రరావుగారు, బూర్గుల వెంకటేశ్వరరావుగారు విచ్చేసిరి. వివిధవిషయము లాలోచించి ఈక్రిందివిధముగా పరిష్కరింపబడినది.

(౧) జిల్లాసంఘ ద్వితీయ వార్షికోత్సవము కల్వకుర్తి తాలూకాస్థలమందు జయప్రదముగా జరుపుటకై స్థానికప్రముఖులంవొకసన్మానసంఘ మేర్పరచబడినది. ఈ సన్మానసంఘమునకు శ్రీయుత డి. రామచంద్రారెడ్డిగారు అధ్యక్షులు రామారెడ్డిగారు, మడపు జానకిరామరావుగారు కార్యదర్శులు. (౧) శ్రీయుతులు నరసింహాచారిగారు, (౨) వెంకటరంగంగారు, (౩) పసుల నారసింహారెడ్డి: (౪) చింతలరాయిరెడ్డిగారు (౫) విశ్వేశ్వరయ్యగారు అలోచనా సభ్యులుగా ఎన్నుకొనబడిరి.

(౨) ఈవార్షికోత్సవము సందర్భమున భోజనఏర్పాట్లు సన్మానసంఘపక్షమున చేయుటకు నిశ్చయించబడినది. జిల్లాలో ముఖ్యముగా కల్వకుర్తి తాలూకాలో పైరు పంటలు నష్టమునల్ల, క్షామపరిస్థితులవల్ల రైతుల దుర్భరస్థితులున్నందున భోజన భాజనములకు అగు ఖర్చులకై రైతులనుండి వసూలు చేయగూడదనియు మొత్తముఖర్చులకు అగుపైకము స్థానికప్రముఖులగు శ్రీయుతులు రామచంద్రారెడ్డి, జానకిరామారావు, రామారెడ్డిగారును ఇతర సన్మానసంఘసభ్యులును న్యాయవాద ప్రముఖులును భరించగలరనియు అంగీకరింపబడినది.

(౩) వార్షికోత్సవ సమావేశమునకు అనుమతి వ్యవహారము జరుపుటకు జిల్లాసంఘ కార్యదర్శిగారిని కోరవలెనని నిశ్చయింపబడినది.

వచ్చిన పరస్థానికులకు సమావేశములో పాల్గొనిన స్థానికప్రముఖులకు శ్రీయుత రామారెడ్డిగారు అల్పాహారము తేనీటితో సత్కరించిరి.

## భువనగిరిలో మద్యనిషేధ ప్రచారము

కల్లు గిరాకి అపరిమితముగ పడిపోవుచుండుట

(స్వకీయవిలేఖరి) భువనగిరి: ౧౯-౫-౧౩౪౭ ఫ.

తే ౧౪-౫-౪౭ ఫ. సాయంత్రము ౫ గంటలనుండి మౌల్వీ అబ్దుర్‌రహిమాన్ (వకీల్) మున్నగు మహమ్మదీయ ప్రముఖులును, శ్రీయుత, గోపాల్‌రెడ్డి (వకీల్) జె. నర్సయ్య మున్నగు హిందూప్రముఖులును కల్లు దుకాణముల వద్దికి వచ్చి మద్యపాన నిషేధమును గురించి ప్రచారము చేసిరి. ప్రచారము మిక్కిలి శాంతముగానే జరిగినను తెల్లవారినుండియే వలుబడియేబడి యూపాయుల గిరాకి తగ్గిపోయెను. వీరు ప్రతిశుక్రవారము నిట్టే ప్రచారము సాగించునట్లున్నది. దీనితో కల్లుగిరాకి పూర్తిగపడిపోవునని తోచుచున్నది. ఈవరకే బొందుగుల, అనాజీపురం, పాకుంట, జాల మున్నగు గ్రామములందు కల్లుదుకాణములు పూర్తిగ మూసివేయవలసి వచ్చినది. తే౧౪-౫-౪౭ఫ. ఈ భువనగిరికి దయచేసియున్న నవాబు మిర్జాయార్‌జంగు బహద్దుర్ గారి అధ్యక్షతక్రింద మద్యపాననిషేధ సభ జరిగె. వకీళ్లును, పుర ప్రముఖులునుగల యొక సంఘము మద్యపాన నిరోధముకొరకు ఏర్పాటు చేయబడెను.

దీనిచే కూలీలు కలవరము జెందియున్నారు. తమనుండి తాళ్లు, ఈదులకొరకును, అడ్డాలకొరకును, తీసికొనిన పైకమును ప్రభుత్వమువారు తీసికొనినపైకమును వాపసు ఇప్పించిన, తామును మద్యనిషేధప్రచారము చేసికొందుము కదాయని అనుకొనుచున్నారు.

## నిజామాబాదులో హరిజనోద్యమము

శ్రీయుత బి. ఎల్ - సంగయ్యగారి ప్రశస్తమైన సేవ

(విలేఖరి)

నిజామాబాదునందు హరిజనసేవకసంఘ కార్యక్రమము ప్రశస్తముగా జరుగుచున్నది. ఒక పాఠశాల పగలురాత్రియు పనిచేయుచున్నది. పగలు ౩౦ మంది విద్యార్థులును, రాత్రి ౨౦ మందియు హాజరగుచున్నారు. ప్రతి శని, సోమవారములయందు వివిధస్థలములయందు భజనజరుగును, హరిజనుల నొక సంఘమేర్పాటుగావింపబడినది. దానియందు ప్రస్తుతము సభ్యుల సంఖ్య ౭౦ దీనికి కార్యదర్శులు శ్రీయుత లక్ష్మాజీగారు. ఈసంఘస్థాపనవలన హరిజనులయందు ఐకమత్యము ఏర్పడినది. సుమారు మూడు సంవత్సరములనుండి నిరంతరము కృషిసలుపుచున్న శ్రీయుత బి, ఎల్ సంగయ్యగారే కారణము. వీరు స్థానికులలో ఉత్సాహవంతులగు యువకులు. వీరు రాష్ట్రీయ హరిజన సేవకసంఘముయొక్క ప్రతినిధిగా పనిచేయుచున్నారు, వీరు గావించుచున్న దీనజనుల సేవ ప్రశస్తమైనది.

## వడిగండ్ల వానచే నష్టము

(ఒక విలేఖరి)

శామీరపేట ౨౫-౫-౧౩౪౭

మేడిచల్ తాలూకాలో చేరిన గణపురం జాగీరు అల్లాపురంజాగీరు, అనంతగిరిపల్లిప్రాంతములలో చలిజ్వరములు పోచమ్మ శాఖలు విపరీతముగ నున్నవి. తన్నివారణకు రామాయణము, భాగవతము, హరికథలు సప్తప్రహార ప్రజన గోపాలుకాలువలు పుత్సవములు గావి పబడుచున్నవి.

౨౨-౫-౪౭ బుధవారము ఉదయం మెదక్, సిద్దిపేట మేడిచల్ మొదలగు తాలూకాలలో తూప్రాన్ రాజాపేట గణపురము మొదలుగాగల గ్రామాలలో ఉదయం ౭నుండి౧౦ ఘంటలవరకు రాళ్లవర్షము కురిసి వేసంగిచేలు నష్టపడినవి. చెట్లు విరిగినవి. గొర్రెలు, మేకలు, పశువులు మృతిచెందినవి, చెరువు కుంటలు నిన్ని నిండి ప్రవహించినవి.

౧-౫-౪౭ శివరాజబహద్దరు స్టేటులోచేరిన గణపురము గ్రామమందు హిందువులబస్తీలో తురుకలు నూతనముగా ప్రార్థనాలయము కట్టకలందుకు యిటీవల వారిందువుల వ్యతిరేకముగా దరఖాస్తుపెట్టబడినదని ప్రజలు అందోళన చెందుచున్నారు.

## గోలకొండపత్రిక

(జాతీయ అర్ధవారపత్రిక)

హైద్రాబాద

చందా వివరములు

సంవత్సరమునకు రు ౬లు

అర్ధసంవత్సరమునకు రు ౩లు

విడిప్రతిక ౧ అణా

The only Leading National Bi weekly of the Andhra Provinces

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA The only out standing effective medium for the ventilation of views and grievances of 70,00,000 Andhras of the Premier State

Volume 12 | HYDERABAD -DECCAN Thursday 3 rd March 1938 | Number 84

# సంస్థానములో పన్ను తెగవేసిరి

## మన్సా సంస్థానములో పన్ను తెగవేయు ఉద్యమము

నాయకులు అరెస్టు చేయబడుట

అహమదాబాదు ఫిబ్రవరి ౨౩

నేడు పన్నుల నిరాకరణ ప్రచారమును తీవ్రరూపమును దాల్చినది. ప్రచారమును సాగించు రైతులపై పోలీసు వారు నేడు లాఠీప్రయోగము చేసిరని తెలియుచున్నది, అశ్వారోహులు గూడ ఆప్రాంతమునకు వచ్చిరి.

పోలీసు కొట్టులవలన స్త్రీలు, పురుషులు, పిల్లలు పలువురు గాయపడిరని గూడ తెలియుచున్నది. ఒక యువకునికి బలమైన గాయములు తగిలినవి.

మన్సా సబర్ కంఠ ఏజన్సీలో నొక చిన్న సంస్థానము అహమదాబాదు నగరమునకు ౩౦ మైళ్లదూరమున నున్నది.

అహమదాబాదు ఫిబ్రవరి ౨౭

మన్సా సంస్థానములో భూమిపన్నును నూటికి ౨౦౦ వంతున ఎక్కువచేయుటచే అక్కడి రైతులు రెండు మాసములనుండి పన్నులు కట్టకుండుటకు నిశ్చయించుకొని ఆజ్ఞోల్లంఘనము చేసినారు. పన్ను తెగవేయు ఉద్యమమింకను సాగుచునే యున్నది. తుదకు నిన్న రైతు సంఘాధ్యక్షుడును కార్యదర్శియు ఇతర నాయకులును అరెస్టు చేయబడిరి. మరియొక అధ్యక్షుని ఎన్నుకొనుటకై జరిగినసభలో పోరాటమును ఇంకను సాగించబడెను. ఇట్లోగా పోలీసులు రైతుల గుడిసెలలోనుండి ధాన్యపురాసులను వశపరచుకొనుచు భూమికిస్తు వసూలు చేయుటకు యత్నించుచున్నారు. ఒకచోట ఒకకుప్పచుట్టును స్త్రీలు కావలియుండిరి అందుచే జరిగిన సంఘర్షణలో ఒక స్త్రీకి గాయమయ్యెను.

## జపాను సైనికులు చైనా సేనలకు తోడ్పడుచుండుట

జపాను సామ్రాజ్య కాంక్షాతత్వముపై ఆగ్రహము

షాంఘాయి ఫిబ్రవరి ౧౩

ఉత్తర చైనాలో షాన్సీ పరగణాలో రాజమార్గపు చైనా పటాలము ఒకటి జపాను యోధులను చాలమందిని ఖైదీలుగా యుద్ధములో పట్టుకొనియుండెను జపాను సైనికాధికారు లిప్పుడు చైనాపై సాగించుచున్న దండయాత్ర యీ జపానుయోధుల కెంతమాత్రమును ఇష్టములేదు. అందువలన వారిప్పుడు చైనా పటాలములో చేరి చైనా సైనికులకు క్రమశిక్షణము నొసంగుచున్నారు. జపానువారి ఆయుధములను ఎక్కువంటిని చైనావారు వశపరచుకొనియుండిరి. అక్రొత్త ఆయుధ పరికరములను ఉపయోగించు పద్ధతులను చైనా సైనికులు సాధకము చేయుటకు యీ జపాను యోధులు తోడ్పడుచున్నారు.

ఖైదీలుగానున్న జపాను యోధులతో చైనా పటాలములు కలిసి మెలసి ప్రవర్తించుచున్నవి. చైనావారు తమ దేశస్వాతంత్ర్యమునకై ఎందుకు పోరాడుచున్నారో, జపానుదేశములో, ప్రజాభిప్రాయమునకు అనుకూలమైన ప్రభుత్వ మేర్పడుట లోకశాంతికి ఏవిధముగా అవశ్యకమో చైనా సైనికాధికారులు యీ జపాను యోధులకు విశదముగా బోధించుచున్నారు.

మూడు మాసములైనపిమ్మట ప్రస్తుతము ఖైదీలుగానున్న యీ జపానుయోధులకు స్వేచ్ఛ యొసంగబడును. వారు యీ చైనా పటాలములో చేరి జపాను సేనలతో పోరాడెదరు.

## సంస్థానముల యెడ బ్రిటిషు ప్రభుత్వ వైఖరి మార్పు చెందినది

తిరువాన్కూరు ప్రముఖుల అభిప్రాయము

త్రివేంద్రము ఫిబ్రవరి ౨౮

భారతదేశము నందలి సంస్థానములు ప్రాతినిధ్య ప్రభుత్వము నొసంగవచ్చుననియు, దానికి బ్రిటిషు ప్రభుత్వమువారడ్డు నిలువరనియు పార్లమెంటులో విటివల్ తెలుపబడియుండెను. భారతదేశ సంస్థానములయెడల బ్రిటిషు ప్రభుత్వమువారి వైఖరి మారినట్లు ఈ ప్రకటనవలన స్పష్టమగుచున్నదని యిచ్చటి ప్రముఖుల యభిప్రాయముగా తెలియబడుచున్నది, ఇదివరకు రీడింగు ప్రభువు చేసిన ప్రకటనకంటె యిదియెంతో అభివృద్ధిదాయకమని తలపబడుచున్నది. సంస్థానములవారు రాజ్యాంగ సంస్కరణలను ప్రవేశపెట్టి బ్రిటిషు రాష్ట్రములతో పాటు ముందు పోవుటకు వీలుచేయుటకు యిట్టి పద్ధతి యవలంబించబడుచుండెనని తలంపబడుచున్నది. సంస్థానములవారు బాధ్యతాయుత ప్రభుత్వము నేర్పరుపవచ్చుననియు, అడిగినప్పుడు బ్రిటిషు ప్రభుత్వమువారు సహాయమొనర్తురనియు తెలుపబడుచున్నది.

## రుమేనియాలో రాజ ప్రభుత్వపద్ధతికి ఉద్వాసన

బుకారెస్టు ఫిబ్రవరి ౨౮

రుమేనియా నూతన రాజ్యాంగ నిర్మాణము విషయమై ప్రజల సమ్మతులు పుచ్చుకొనబడినవి. వోటర్లందరు నిర్బంధముగ సమ్మతుల నొసగవలయునని నిర్ణయింపబడెను. మూటికి ౯౦ మంది అనుకూలముగ సమ్మతుల నొసగిరని తెలియుచున్నది. అందుచే రాజప్రభుత్వ పద్ధతి పోవును.

## వివిధ రాజ్యాల సైనిక బలము

సైనిక బలములో పోటీ చేయుచున్నవారి ఉద్దేశముల బలము క్రింది పట్టికవలన స్పష్టపడగలదు:—

సైనిక బలము

| | రెగ్యులర్ | ట్రెయిన్డ్ రిజర్వ్‌స్ |
|---|---|---|
| రష్యా | 1,545,000 | 17,900,000 |
| ఇటలీ | 1,331,200 | 5,638,000 |
| ఫ్రాన్సు | 658,777 | 5,500 000 |
| జర్మని | 650,000 | 1,368,000 |
| గ్రేట్ బ్రిటన్ | 384,780 | 669,897 |
| జపాన్ | 282,000 | 2 000,000 |
| యునైటెడ్ స్టేట్సు | 166,159 | 308,239 |

విమానాలు

| | |
|---|---|
| రష్యా | 5,000 |
| గ్రేట్ బ్రిటన్ | 4,500 |
| ఫ్రాన్సు | 4,000 |
| ఇటలీ | 3 500 |
| జర్మని | 3,000 |
| యునైటెడ్ స్టేట్సు | 2,200 |
| జపాన్ | 2,100 |

నౌకాబలము

| | నౌకాబలము (టన్నులు) | నిర్మాణంలో ఉన్నవి |
|---|---|---|
| గ్రేట్ బ్రిటన్ | 1,232,854 | 288,215 |
| యునైటెడ్ స్టేట్సు | 1,062,878 | 336,655 |
| జపాను | 754,242 | 93,907 |
| ఫ్రాన్సు | 546 173 | 180 816 |
| ఇటలీ | 406,333 | 109,675 |
| రష్యా | 200,000 | ...... |
| జర్మని | 125,458 | 111,500 |

## చైనాప్రజలమీద జపానుసైనికుల రాక్షస కృత్యములు

వందలకొలది స్త్రీలను చెరపట్టి మానభంగం చేయుచున్నారు

చైనాలో జపానువారు చేయుచున్న అమానుషకృత్యములనుగురించి "డెయిలీటెలిగ్రాఫ్" ప్రత్యేకవిలేఖరి ఆదేశపత్రికలో ఒక వ్యాసమును ప్రకటించాడు. దాని సారాంశం నాంకింగు సమీపములో ౨౦ వేలమంది చైనావారిని జపానుసైనికులు చిత్రవధ చేసినారు. కొన్నివేలమంది స్త్రీలను మానభంగం చేసిరి.

చైనాలోనున్న జపానురాయబారి కార్యాలయోద్యోగులు చూచుచుండగానే ఘోరమైన అత్యాచారములు ఎన్నెన్నో జరిగినవి. చైనా రాజధానిని వశపరచుకొనుటకు పోరాటము జరిగిన నాలుగువారాలలో నాంకింగువీధు లన్నియు పీనుగపెంటలైపోయినవి.

ఒక స్త్రీని ౨౦ సార్లు మానభంగం చేసినారు. ఆమెతో పనిఅయిపోగానే రోడ్డు ప్రక్కకు లాగివేసి బయొనెట్టతో తలను నరికివేయుటకు యత్నించినట్లున్నది. దక్షిణంకొరుచు గొంతుమీద ఒక పెద్ద గాయంకూడా కనిపించినది.

## నిర్మాణ కార్యములయందు శ్రద్ధ

పంజాబు ప్రభుత్వమువారి ఆయవ్యయ నిర్ణయ క్రమము

లాహోరు మార్చి ౧

నేటి మధ్యాహ్నము పంజాబు ప్రభుత్వమువారి ఆర్థికమంత్రి మనోహరలాలు పంజాబు శాసనసభయగు అసెంబ్లీలో ౧౯౩౮–౩౯ సం॥నకు ఆయవ్యయ నిర్ణయ కార్యక్రమ మెరిగించిరి.

౧౯౩౭–౩౮ సం॥పు ఆయవ్యయముల పునర్నిర్ణీతములైన లెక్కలనుచూడగా, మొదట అనుకొనియుండినట్లు రూ ౧౬ ౧/౩ లక్షలే గాక రూ ౨౩ లక్షలు మిగులగలవని తేలినది. ఈమిగులుచే హావేలి ప్రాజక్టు నిర్మాణమునకు ప్రారంభములో అయినఖర్చులు భరించబడెను.

౧౯౩౮–౩౯లో నిమియర్ శిఫారసుల ప్రకారము ఇండియా ప్రభుత్వమువారినుండి లభించు రూ ౧ . లక్షల ౪ వేల నలుబది, నిజముగా రూ ౫౦–౨౦౦౦౦లు మిగులును. ప్రభుత్వమువారు ఈ మొత్తము నంతయు ఒకనిధిగ చేర్చి గ్రామ పునర్నిర్మాణమును పట్టుదలతో సాగించుటకై ఉపయోగించదలచినారు. మొత్తము మీద ౧౯౩౮–౩౯ అఖరున మొత్తము మిగులు ౬ లక్షల ౨౪ వేలు.

ఈ మొత్తము, నిమియర్ శిఫారసుల ప్రకారము ఇండియా ప్రభుత్వమునుండి లభించు మొత్తమును చూపించకుండ, ౧౯౩౭–౩౮ సంకలనకు చేర్చబడినది.

## షాన్సీరాష్ట్ర దండయాత్ర

జపాను విజయములు

టోకియో ఫిబ్రవరి ౨౮

షాన్సీరాష్ట్ర దక్షిణభాగములో సుమారు రెండులక్షల ఏబదివేల చైనా సైన్యములను జపానుసేనలు చుట్టుముట్టియున్నవి. షాన్సీరాష్ట్ర ముఖ్యపట్టణములలో నొకటియగు లింగ్ఫెంగు పట్టణము జపానువశమయినది జపానుసేనలలో ఒకపటాలము టయూవాన్ నగరమునుండి పశ్చిమదిశకువెళ్లి ఫ్యాంగ్‌హో నదీతీరము చేరినదని జపాను అధికారులు తెలిపిరి.

## కమ్మవారికి గర్భగుడిలో ప్రవేశించుఅధికారములేదు

మదరాసు హైకోర్టువారి తీర్పు

మదరాసు: ఫిబ్రవరి ౨౫.

కమ్మకులజులకు శివాలయముల గర్భగుడిలో ప్రవేశించి అభిషేక మొనర్చుటకు అధికారము గలదాయను విషయమును గురించి న్యాయమూర్తి బరన్ గారు నిన్న సాయంత్రము ఒక క్రిమినలు రివిజను పిటిషనునందు తీర్పు చెప్పిరి.

ఈ క్రింది సందర్భములలో పై క్రిమినలు రివిజను పిటీషను విచారణకు వచ్చెను: గన్నవరం తాలూకా మానికొండ గ్రామమున మల్లికార్జున స్వామి దేవాలయమను పేర ఒక శివాలయము గలదు. పెనకటి కార్తీకపౌర్ణమినాడు, అచట పెద్ద ఉత్సవముజరిగెను. తత్సందర్భమున గర్భగుడిలో స్వామివారికి అభిషేకము జరుగుచుండగా, ముల్పూరి ప్రకాశరాయశర్మ అనుపేరు గల కమ్మకులజుడు, తనకుగూడ బ్రాహ్మణులతో సరిసమానమగు అర్చనాధికారము గలదని చెలువుచు, గర్భగుడిలో ప్రవేశించి శివలింగముపై ఉదకముపోసి అభిషేకమొనర్చెను అర్చకులు మొదలగువారు ఎంతవారించినను ఆతడాగలేదు. అటుపిమ్మట, సదరు దేవాలయమునకు ధర్మకర్త్రియగు గన్నవరంరాణీగారు, గన్నవరం స్టేషనరి సబుమేజస్ట్రేటుకోర్టులో, ఇం. పి. కో. ౨౯౫ సెక్షను క్రింద ముల్పూరి ప్రకాశరాయశర్మగారిపై ఫిర్యాదు దాఖలు చేయించిరి. అనాదిగావచ్చుచున్న ఆచారప్రకారము. సదరుదేవాలయమున బ్రాహ్మణులు మాత్రమే గర్భగుడిని ప్రవేశించి అభిషేకమొనర్పు అధికారము కాదనియు ప్రాసిక్యూషను తరపున వాదింపబడెను.

ముద్దాయి తరపున, ముద్దాయి నేరగుడు కాడనియు, కమ్మకులజుడైనను వేద శాస్త్రములు చదివియుండుటచే బ్రాహ్మణులతో సమానుడనియు, అందుచే బ్రాహ్మణులవలె గర్భగుడిలో ప్రవేశించి అభిషేకమొనర్చుటకు అధికారము కలవాడనియు వాదింపబడెను.

ఫిర్యాదులు దేవాలయమున సంప్రోక్షణ మొనర్చినను, తాము తిరిగి దేవాలయ గర్భగుడిని ప్రవేశించి అభిషేక మొనర్చెదరని చెలిపెను.

మేజస్ట్రేటుగారు ఉభయపక్షములను విచారణచేసి సదరు దేవాలయమున గర్భగుడిని ప్రవేశించి అభిషేక మొనర్చు అధికారము బ్రాహ్మణులకే అనాదిసిద్ధమగు ఆచారముగ వచ్చుచున్నదనియు, ముద్దాయి బ్రాహ్మణుల మతభావములకు కష్టము కలిగింపదలచెను ఉద్దేశముతో గర్భగుడిని ప్రవేశించి అభిషేకమొనర్చెననియు అతనికట్టి హక్కులేదనియు నిర్ణయించి. ఇం. పీ. కో. ౨౯౫ సెక్షను క్రింద ముద్దాయిని నేరస్థునిగ నిర్ణయించి రు౧౦౦లు జరిమానా విధించెను.

ముద్దాయి అప్పీలు చేయగా, మాజవీడు సబుడివిజనలు మేజస్ట్రేటు నేరమును స్థిరపరచి శిక్షను ఖాయపరచెను దానిపై ముద్దాయి హైకోర్టులో రివిజను పిటిషనును దాఖలు చేసెను. అది న్యాయమూర్తి బరన్ గారి యెదుట నిన్నటి దినమున విచారణకు వచ్చెను.

దేవాలయమును అశుచిచేసి అపవిత్రమొనర్చినపుడు మాత్రమే ఇ.పీ.కో. ౨౯౫ సెక్షను క్రింద నేరమగుననియు, అభిషేక మొనర్చుట, హిందువులు దేవుని అర్చించు పద్ధతులలో నొకటియనియు, దేవుని అది అపవిత్రమొనర్చుట గాదనియు: హిందువులెవరైనను సరే, గర్భగుడిని ప్రవేశించి అర్చించుట కధికారము గలదనియు ముద్దాయి తరపున వాదింపబడెను.

న్యాయమూర్తి తీర్పుచెప్పుచు ముద్దాయితరపు వాదనను నిరాకరించి, బ్రాహ్మణులతో సమానాధికారములగలుట ముద్దాయి ఉద్దేశమనియు బ్రాహ్మణులుతప్ప ఇతరులు గర్భగుడిని ప్రవేశించి అభిషేక మొనర్చుట ఆ దేవాలయ ఆచారమునకు విరుద్ధమనియు, బ్రాహ్మణుల మనస్సునకు నొప్పి కలిగించుటకు ముద్దాయి ఇట్టి చర్య నొనర్చెననియు నిర్ణయించి నేరమును ఖాయపరచిరి. శిక్ష చాల తక్కువగనే విధింపబడెనని నుడువుచు దానినికూడ న్యాయమూర్తిగారు ఖాయపరచిరి.

ముద్దాయితరపున ఎ. లక్ష్మయ్య, ప్రభుత్వము తరపున పబ్లిక ప్రాసిక్యూటర్లు ఫిర్యాది తరపున ప్రతివాది సత్యనారాయణరావు గారు వాదించిరి

## ప్రయాగ రాష్ట్రమున మద్య నిషేధము

ఈటా మెయిన్పురిజిల్లాలో ౧-౪-౩౮ నుండి ప్రారంభము

అలహాబాదు ఫిబ్రవరి ౨౮

ఈటా, మెయిన్పురి జిల్లాలో పూర్తిగ మద్యనిషేధమును ౧-౪-౩౮ నుండి ప్రవేశపెట్టుటకు ప్రయాగరాష్ట్ర ప్రభుత్వమువారు నిశ్చయించిరి. రాష్ట్రములో తక్కినచోట్ల నూటికి ౨౫ చొప్పున కల్లు సారాదుకాణములను తగ్గించెదరు కాన్పూరు, లక్నో, అలహాబాదు, ఆగ్రా జిల్లాలందున్న దుకాణములను ఎక్సైజు శాఖవారే నిర్వహించవలెను. తక్కిన దుకాణములను వేలముచేసి చిల్లరధరలను నిర్ణయించి నాటు సారాయిని సీల్డుచేసిన సీసాలలో పోసి విస్తారముగ దుకాణపు ఆవరణ కావలసె త్రాగువటుల విక్రయించెదరు. ఈటా మెయిన్పురీలందు ౧-౪-౩౮ నుండి ఎక్సైజు దుకాణములన్నిటిని మూసివేయవలెను. ఈ సంవత్సరము సెప్టెంబరు ౩౦ తేదీతో "తారీ" విక్రయ దుకాణముల లైసెన్సు అంతరించవలెను. నల్లమందు ఆరోగ్యముకొరకు అవసరమని కలెక్టరు కుతోచిన వారమున కింతమొత్తము నీయవలెనని ఉత్తరువుచేయును. జిల్లాలోనున్న సైన్యములు రైళ్లలో ఎక్కుటకు అగిన ప్రయాణీకులు విదేశి నాటుసారాయిని ప్రత్యేకాధికారము లేకుండ సమంజసమగు సారాయిని గొంపోవచ్చును. దగ్గర ఉంచుకొనవచ్చును.

మందులకు కావలసిన మత్తు పదార్థములను కష్టములేకుండ త్వరగా సప్లయి చేతురు. పైమిన హాయింపులకులోనై ఈజిల్లాలో దిగుమతి అపు చేయబడును.

ఇతరజిల్లాలో దుకాణముల సంఖ్యను తగ్గించెదరు. ఈజిల్లాలకు అయిదుమైళ్లదూరములో ఎట్టి దుకాణములుంచరాదు. వాటిని క్రొత్త స్థలమునకు మార్చరాదు ఎక్సైజుశాఖచే ప్రత్యక్షముగ నిర్వహించబడు దుకాణముల ఆవరణలయందు మత్తు పదార్థములను ఉపయోగించరాదు, తక్కిన దుకాణములను వేలముచేతురు లా క్రొత్తవిధానమును అమలుజరుపుటకు సాధారణపు పోలీసు ఎక్సైజు సిబ్బందినే నియమించెదరు:



Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad, Editor K Balakrishna Reddy